౧౧. 'పడవాళ్లు' సరియైనరూపము. 'పడతాలు' అచ్చుతప్పని తలంతును. భటుడు అనియే యర్థము. పుట 215.

౧౨. సాత్తిన-సాత్తని అనునవి అర్చకుల శాఖలుగావు. వైష్ణవులలో ద్విజ-ద్విజేతర భేద సూచకములు. శాత్తిన-శాత్తాద అను అరువ పలుకుబడి కిది తెలిగింపు ధరించిన-ధరింపని- అని యర్థము. జంధెమని శేష మూహ్యము. కనుక సాత్తిన వారు బ్రాహ్మణులు, సాత్తని వారు ఇతరులు. కాబట్టే విష్ణుచిత్తునివెంట సరకులను మోసికొనివచ్చిన ఆ వైష్ణవులు 'విధినిషేధంబు లెరింగితే' నన్నాడు రాయలు. సాత్తని వారే ఇప్పటి సాతానులు. ఈ యిద్దరికిని తామిచ్చిన లక్షణ మెక్కడిదో యెఱుగను. పుట 221.

(౧౩) శంఖఫలకము అరవములో 'చంగప్పలకై' అను దాని పరివర్తనము. మధురలోని ప్రాచీన ద్రావిడ 'సంఘ' సంప్రదాయములకు చేరినది. అరవవ్రాత 'చంక' అనే యుండునుగదా. తెలుగులో అది సంస్కృత వాసనతో 'శంఖ'గా మారిందేమో. ఈ మార్పు ధూర్జటి కాలానికే వచ్చిందేమో. ధూర్జటే స్వతంత్రంగా చేసిన ప్రయోగాలో. అచ్చువేసిన వారు అవివేచనగా చేసిన రూపాలో కాళహస్తి మాహాత్మ్యంలో ఎన్నో యున్నవికదా. పుట 224.

(౧౪) ఇడుమ కట్టు=చేతులు కాళ్లు ఆడించ వీలులేకుండా కట్టిన బంధన మన వచ్చును. 'ఇంటి ముందట' అను నర్థము సుగ్రహం కాదు. పుట 231.

(౧౫) 'గర్భమంటపీ'త్యాది పద్యము ఇంకొకమారు తాము చూడ వేడినాను. మాలదాసరికి అభిషేక తీర్థార్హత లేదు; అతని కిచ్చు తీర్థము నేల కడిగిన నీళ్ళే. దానినిగూడ ఇచ్చువాడు 'త్రివర్ణేతర జాతి'వాడే 'గుడి వెడలి వచ్చు' ఆ మురికి నీటినిగూడా తాకుటకు అతని కర్హతలేదు ఇంతేకాని ఆ ఘట్టములో మీరు సూచించిన వైష్ణవసంస్కార ప్రియత్వ మునకును శూద్రార్చకత్వమునకును అవకాశము కానరాదు. పుట 234.

(౧౬) "కూచి మారమనోజ...కామ సిద్ధాంతములు" 'నాట్యము'లా? పు. 247.

(౧౭) 'రఘునాథమేళ' అనునది వీణ. రాగముగాదు. పుట. 250.

(౧౮) 'హంసివోవగా' అంటే అపత్యముకాఁగా-వ్యర్థముకాఁగా - అని యర్థము. కన్నడంలో ఇదే అర్థం 'పుసి' అని ప్రాచీనరూపం తెలుగులో 'ముసి' అని మారింది. శ-ర-చూడుడు. 'అధికముకాగా' అనే అర్థము స్వంత మగును. పుట 277.

(౧౯) 'త్రొక్కుడు బొమ్మ' ఏదో నాకూ తెలియదు. కాని చరణాభ=కాళ్ళ కాంతి, దానిమీఁద, ఇచ్చెన=వన్నె-ఘటింప వడికిరని అర్థము సరసంగా లభిస్తుంది. చరణాభ ఇచ్చెన-రాట్నపు సామానులు కావు. పుట 282.

(౨౦) 'పొప్పళి' అన్న పదము మా ప్రక్క 'చౌకపు ఇండ్లు' అనే అర్థంలో వాడుదురు. పొప్పళి చీరలు నేటికిని ఈ దేశం కోమటి స్త్రీలకు చాలా ప్రియం. పొప్పాయికాయతో దీనికి సంబంధం మృగ్యం. ఈ పదం కన్నడంలోనూ కలదు. కదరీపతి కన్నడదేశానికి సమీపంలోనివాడు. పుట 828.

(౨౧) 'జక్కిణి' సరియైన రూపమే దక్షిణ నాట్యపద్ధతులలో నొకదు గాటోలు. పుట 810.

(౨౨) వేణుగోపాల శతకం పదాల సారంగపాణి వ్రాసినదని విన్నాను. అతడు తిరుపతికి దగ్గరివాడు. పుట 845.

తమ గ్రంథం నిజంగా నా కెన్నో నూతన విషయాలను తెలిపినది. మరల ఎన్నోమారులు పఠింపవలసి యున్నాను. ఆ గౌరవమే పై భిన్నాభి ప్రాయములను మీ పునర్విమర్శకొఱకు నన్ను ఇట్లు వ్రాయ ప్రేరించినది. మీ రన్యథా భావింపరని నే నెఱుగుదును.

మీ గ్రంథం చేతికందిననాడే మా అన్నగారు గోపాల కృష్ణమాచార్యులు ఇక్కడనుండి కొంత పఠించి నావలెనే చాలా సంతోషించిరి. ఆ నాడే వారు వెళ్ళవలసియుండి పూర్తిగా చూడలేరైరి. ఇంతలోనే వారు హైద్రాబాదుకు వత్తురు. తమ దర్శనము చేయదలచినారు. జ్యోతిషమందు వారెక్కువ పరిశ్రమించినవారని తాము వినియుందురని నమ్మెదను. మరియు విజయనగర చరిత్ర వారి కభిమానపాత్రము. సాహిత్యమందు చక్కని పాండిత్యము.

చిత్తగింపుఁడు, మీవాఁడు
రా. అనంత కృష్ణశర్మ

పై వాటిలో కొన్నింటికి కొంత సమాధాన మవసరమైనది. సంఖ్య (౪) తెలంగాణములో బోయీలు అను జాతివారు నేటికిని కలరు. వారిప్పటికి పల్లకీలు మోయుదురు. రాయలసీమలో రాయచూరు గుల్బర్గా జిల్లాలో (బేండర్) బోయ జాతి కలదు. అది విజయనగర సైన్యాలలో ముఖ్యమైనదిగా నుండెను. క్రీ. శ. ౧౬౦౦ ప్రాంతములందు కాక మానమూర్తి తన రాజవాహన విజయ మందు యుద్ధసైనికులలో బేండర్ బోయలను వర్ణించినాడు.

కర్ణాట కిరాటకీచకులు అను శబ్దములను వాడినందున ఈ అపోహకు తావు కలిగినందున ఈ తడవ కర్ణాటకిరాతులు అని వివరించినాను. భోయి, బోయ అను భిన్నజాతులను నేను వివరించినాను : అంతే.

సంఖ్య (౬) - బ్రాహ్మణులలో అన్ని విద్యలు కేంద్రీకరించి యుండెను. అనుటలో విద్యలనగా వేదవేదాంగములను నర్థములలో వాడితిని. మెలకువ తక్కువగుటచే అతివ్యాప్తిదోషము చుట్టుకొని ప్రేమస్వరూపులగు మిత్రుల సుకుమారపు మందలింపునకు గురి అయినాను.

సంఖ్య (౯) జక్కులు-యక్షులు తెలుగు దేశమువారు కారేమో అని నాకును స్ఫురించియుండెను. క్రీస్తుశకారంభములో అంతకు పూర్వమందు మంగోలియా ప్రాంతమందు యచీ (*Yuchi*) అను జాతి ప్రబలమై యుండెను వారే యక్షులేమో అని తలచినాను. టిబెటులో "జాక్" అనునది జడలబర్రెకు పేరు. కాన అది కాదనుకొందును. యక్షులు ఆక్సస్ లేక జక్సార్టీసు నదీ ప్రాంతీయులైనను అయి యుందురు.

సంఖ్య (౧౦) కృష్ణరాయలు రెడ్లను హేళనము చేసెననుట తప్పు పట్టుటకు కాదు. అయినను ఆ మాటను గ్రంథమునుండి తొలగించినాను.

సంఖ్య (౧౩) శంఖ శబ్దార్థము ఉత్తమసూచన.

సంఖ్య (౧౬) నాట్యమనుట నా స్ఖాలిత్యమే. సవరించుకొన్నాను.

సంఖ్య (౧౭) రఘునాథమేళ అనునది రాగమని పిలుతురు. వ్రాసినదే వ్రాసితిని. ఇప్పుడు శ్రీ శర్మగారినే ప్రమాణముగా తీసుకొన్నాను.

సంఖ్య (౨౦) పొప్పడికాయ మనదేశానిది కాదు. దక్షిణ అమెరికా నుండి క్రీ. శ. ౧౭ శతాబ్దాంతమందు మనదేశానికి వచ్చెను. కాన కదిరీపతి

కాలాని కది లేదని తెలిసియు ఏదో సమాధానము వ్రాసితిని. ఇప్పుడు శ్రీ శర్మ గారి సూచన సరిపోయినది.

సంఖ్య (౨౧) "జక్కిణి" దేవర్లకొలుపులు అని రాయలసీమలో బహు ప్రాంతములందు చేయుదురు. ఎవరైన ఒకయింటిలో హఠాన్మరణ మొందిన ఆ యింట కలుగు విపత్తులకా మృతినొందినదయ్యమే కారణమని ఆమెను "జక్కిణి" దేవరగా నిలుపుకొని ఆ యింట వివాహములకు ముందు ఆ దేవరను గొలుతురు. ఒక చిన్నముంత దానికి మూతగా బొంగరమువంటి ఒక చిన్న మట్టిపిడత - ఇట్టివి మూడు జతలు పెట్టి జక్కిణి చిందులతో, వాద్యముతో, పాటలతో కొలుపులు కొలుచువారిని పిలిపించి దేవర్లను కొలుతురు. ఆ కొలుపులోని ఆటకే జక్కిణి అన్నానేమో అని యిప్పుడు నాకు స్ఫురిస్తున్నది.

ఈ కొద్దిపాటి సమాధానము ఆత్మసమర్థనమునకుగాక ఇప్పుడు తోచిన భావాలను వెల్లడించుకొనుటకే యని మనవి.

స మా ప్త ము.